## నటీనటులు

పద్మశ్రీ శివాజీ గణేశన్, కె. ఆర్. విజయ, యల్. విజయలక్ష్మి, నాగేష్, సచ్చు, బాలయ్య, ముత్తురామన్, సుందరీబాయ్

### నేపథ్యగాయకులు :

పి. సుశీల, ఎల్.ఆర్. ఈశ్వరి, పి.బి. శ్రీనివాస్,
పి. బాలసుబ్రహ్మణ్యం.

నృత్యం : పసుమర్తి కృష్ణమూర్తి

### స్టూడియోలు :

శారదా, జెమినీ, విజయ, వాహినీ, ఏ.వి.ఎమ్, థామస్.

### శబ్దగ్రహణం :

పాటలు, రీరికార్డింగ్ : జె. జె. మాణిక్యం
మాటలు : కె. డి. సతీష్

పబ్లిసిటీ ఆర్టిస్టు : కె. రామదాసు
ప్రెస్ పబ్లిసిటీ : (జేమ్స్) గౌతమ్
కూర్పు : కె. దాశరధి
ఛాయ : యస్. బాలకృష్ణన్ బి. ఎ.
నిర్వహణ : పి. ఆనంద్, యేలూరి సీతారామ్ బి.ఎ.
సంగీతం : ఎమ్. ఎస్. విశ్వనాధన్, ఎ. ఎ. రాజ్.
మాటలు,పాటలు : అనిసెట్టి
నిర్మాత : బోడగల క్రిష్ణయ్య
కలర్ ప్రొసెసింగ్: జెమినీ కలర్ లేబరేటరీ
కథ, దర్శకత్వం : శ్రీధర్

విడుదల :

**పూర్ణా పిక్చర్స్, విజయవాడ,**
గుంతకల్, సికింద్రాబాద్.

# ఆదర్శ పెళ్ళిళ్ళు

## కథా సంగ్రహము

శ్రీమంతుడైన వెంకటచలం చిన్నప్పుడు ఒక తప్పు చేశాడు. ఒక యువతితో సంబంధము పెట్టుకొని ఒక ఆడ పిల్లను కన్నాడు. ఆయువతి చనిపోయి, ఆ పిల్ల అనాథ గాలైంది. కాలం గడిచిపోయింది. నిజం మరుగుపడింది.

ఇప్పుడు వెంకట చలం తన భార్యతోనూ, విద్యా ధికుడైన రవి అనే కుమారునితోనూ సగౌరవంగా సమా జంలో జీవిస్తున్నాడు.

విధి వక్రించింది. ఆ ఆడపిల్ల గతిలేని పరిస్థితుల్లో తండ్రిని వెతుక్కుంటూ వెంకటచలం వద్దకు బయలు దేరింది. కాని త్రోవలో ఒకకారు ఆక్సిడెంట్ జరిగి రవి చేతనే ఆస్పత్రిలో చేర్చబడింది. ఆమెస్థానే ఆ ఆక్సి డెంట్‌కు కారణమైన విజయ అనే అమ్మాయి ఆమె పెట్టె తీసికొని వెంకటచలంవద్దకు వచ్చి, తనే కూతురినని చెప్పి బెదిరించింది. వెంకటచలం ఆమెమాట నమ్మి తనకు కూతు రున్నదనే విషయం, భార్యా బిడ్డలకు తెలిస్తే పరువుపోతుం దని భయపడి ఆమెను బ్రతిమాలుకొని యింట్లోనే అట్టిపెడ తాడు. ఆమె తన చెల్లెలుకాదని తెలుసుకున్న రవి, తండ్రి చేసిన తప్పును తండ్రిచేత బైట పెట్టించే ఎత్తువేసి, ఆమెతో ప్రేమకలాపాలు ప్రారంభిస్తాడు.

వారిద్దరినటన నిజమైన ప్రేమగా మారుతుంది. తన కొడుకూ, కూతురూ ప్రేమించుకుంటున్నారని భ్రమపడిన

వెంకటచలం వారిని విడదీయడానికెంతో ప్రయత్నిస్తాడు.

ఈ లోపల తనచెల్లెలు రతి కోలుకొని తనమిత్రుణ్ణే ప్రేమిస్తున్నదని తెలుసుకున్న రవి సనాతనుడైన ఆ మిత్రుని తండ్రిని ఒప్పించడంకోసం ఎన్నోపన్నాగాలు పన్ని ఆమెను వారియింట్లోనే చేర్పించి నాటకమాడుతాడు.

ఆఖరికి రతి గొప్పభాగ్యవంతులబిడ్డనే ఉద్దేశంతో అతడు రతిని కోడల్ని చేసుకోడానికి ఒప్పుకుంటాడు.

రతి వివాహసమయంలోనే రవి విజయుల వివాహం గూడా ఏర్పాటౌతుంది.

వెంకట చలం ఏంచేస్తాడు ?

తన తప్పును పదిమందిలో ఒప్పుకుంటాడా ?

తండ్రికి రవి పశ్చాత్తాపం కలిగిస్తాడా ?

భర్తనే దైవంగా పూజించే రవితల్లి ఏమౌతుంది?

ఈ విపరీత సమస్యల విచిత్ర పరిష్కారాలకు వెండితెరపై చూడండి !!

వినోదించండి !!!

# పాటలు

1 రచన : ఆనిసెట్టి

పాడినవారు : పి. సుశీల

తీయగా పాడనా !
హాయిగా ఆడనా !
విరిసినా ఆశయే
మైకమై సాగనా ||తీ||

2. నా మదిలో కోర్కెలు పూచే
నవజీవన కాంతులు తోచే
ఈజగమ్మె ఎంతో మనోహరమ్మె
సుఖమ్మె నింపే స్వర్గము !
బ్రతుకంతా నవ్యభావనా
డోలిక లూగేనో ||తీ||

3. నా హాసం అందం చిందె
నా వదనం కన్నుల విందె
ఈ విలాస భోగం మనోహరాగం
విచిత్ర యోగమ్మేరే
బ్రతుకంతా నవ్యభావనా
డోలిక లూగేనో ||తీ||

పాట 2 రచన : ఆనిసెట్టి

పాడినవారు : పి.బి. శ్రీనివాస్, ఎల్.ఆర్. ఈశ్వరి

అతడు : కలలుగాంచి నా రాణి వచ్చె
నన్ను మోజుతో కవ్వించే

ఆమె : ఎర్రని మోవిని నవ్వుల పువ్వులు జాదే
లేతమనస్సులు యౌవనసౌఖ్యం కోరే

అతడు : చక్కనైన మోహిని చేరవచ్చెను
అందములలో నాతో పందెం వేసెను

ఆమె : మోహినియే మోజుతో చిన్నా చేరెను
ఆశతీరగా అమృతాలు పంచెను

అతడు : అందం కోరేనా మనస్సే అందం కోరేనా

ఆమె : డెందం దోచేవా ప్రియా నా డెందం దోచేవా

ఇద్దరు : మనసులోన నిండియున్న మమత చూసేవా ॥క॥

ఆమె : మౌనముగ చిన్నవాడు మనసు తెలిపెను
ఏమిచేయక నేను సరసమాడెను

అతడు : కన్నెపిల్ల ప్రీతితో పలకరించెను
కలువ చూపులే మది మోహం నించెను
మోహం నిండేనా ఏదో ఒక దాహం నిండేనా

ఆమె : మనస్సే ఊయల లూగేనా
వయస్సే పొంగులు వారేనా

ఇద్దరు : మనసులోన నిండియున్న మమత చూసేవా

అతడు : నడకలో షోకులు అతి నాజూకులు చూపే
వయసూ సొగసూ మనసున కోర్కెలు రేపే ॥

పాట 3

రచన : అనిసెట్టి

పాడినవారు : పి. బాలసుబ్రహ్మణ్యం

ఇదే చిన్నదిలే షోకైనదీ, అందమ్ములు చిందెనులే
మైమరపించి కవ్వించు ఈడు, వయసో పదిహేడు ॥ఇ॥

అమృతంయిచ్చే మోహినికే నీవే ప్రతిరూపము
ఆరని విరహము రగిలెనుమా అదియె నా తాపము
వీడనుమా చూడవులే జోడూ కూడవులే
సరసాలా హాస్యాలా, నీ అలుకా మానవులే ॥ఇ॥

మోహముతో మురిపించితివే, ముద్దుగ పలుకవులే
మోజులుగొలిపే వగలాడీ, నీ పోజులు మానవులే
హృదయాలూ దోచుకొను వగలే నీకు వరం
దివ్యసుఖం విరియించే, పలుకే ప్రణయస్వరం ॥ఇ॥

పాట 4 రచన : అనిసెట్టి

పాడినవారు : పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

అతడు : పూబాలయే సుకుమారియే
నవనాట్యాలాడేనులే ।

ఆమె : కొంటెవాడు గాలి బాలుడే
ఎదమోహాసే నించెలే ।

అతడు : అందం విందులు చేసే లోకం
అనుక్షణ ఆనందం యౌవన స్వర్గం
కలలో యిలలో కవ్వించెనోహో
విరిసే వయసే ఊగే మనసే ॥పూ॥

ఆమె : మోహం పన్నిన వింతగు వ్యూహం ।
పొంగెను నా మది మోహన రాగం ।
చెలిమే కలిసే విరిసే పరువం
ఇలలో వలపే మధురం మధురం । ॥పూ॥

పాట 5 రచన : అనిసెట్టి

పాడినవారు : పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

ఆమె : ఇదే మధురమైనా ప్రేమాలీలా ।
ఇదే మదిని మోహాల్ మీరువేళా ।
అనురాగస్వరం యిదే దివ్యవరం
విరియించెనోహో ఆనందం । ॥ఇ॥

అతడు : హాయి గొల్పెడి ఆమనివేళా
ఆడవోహో ముద్దుల బాలా
ఓర చూపుల నవ్వులె చాలూ
వలపులడోలా మనములె తేలూ । ॥ఇ॥

ఆమె : ఈడు జోడగు తీయని చెలిమీ ।
నిండుయౌవనం తీరని కలిమీ ।
దివ్యప్రేమా దేవుని వరమే ।
అదియే వేయి జన్మల ఫలమే । ॥ఇ॥

పాట 6 రచన : అనిసెట్టి

పాడినవారు : పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల

అతడు : హాపీ హాపీ హాపీ
లోకమే హాపీ : హాపీ హాపీ

ఆమె : హాపీ హాపీ
లోకమే హాపీ

అతడు : కొండపయి మబ్బుల గాంచి ఆడే మయూరివే

ఆమె : గగనమున చుక్కల డోలలనూగే చంద్రుడవే

అతడు : జోడు లేదా ?

ఆమె : ఇదే గాదా ?

అతడు సుఖం లేదా ?

ఆమె : ఇదే గాదా ? ॥హా॥

అతడు : నెచ్చెలి విలాస లాస్యాలన్నీ
ఎదనే కలచెనో హో
ఆ తీయని అచ్చట ముచ్చటలో నా
ప్రణయం విరిసేనో

ఆమె : నా రూపం నీదేలే నా మనసూ నీదేలే
మన జీవితమే ప్రణయామృతమూ
మధురమ్ముగ సాగునులే ॥హా॥

అతడు : అందం అనంతసౌఖ్యమ్మనుచూ
జగమే భావించే
నా ముద్దుల బాలా నను చేరా జీవితమే తరియించే!

ఆమె : నా దైవం నీవైనా నీ ప్రేమయే పరమౌనా
ఫలియింతునులే కనువిందులుగా
బ్రతుకంతా సాగునులే ॥హా॥